# క్షేత్రయ్య కీర్తనలు

**అకారాది సూచిక**

001. అఠాణా – త్రిపుట

(నాయిక: పరకీయ – స్వాధీనపతిక)

పల్లవి:

అక్కరో! యొర్వనివారు సరసుడు గాడని – ఆడుకొంటే ఆడుకొనేరు

అను పల్లవి:

మ్రొక్కదగినవాని – ముద్దుమాటలవాని – మువ్వగోపాలసామిని

యెవరైనగాని   అక్క..

చరణము(లు):

రామ! వానిదలచినప్పుడే – రవిక క్రిక్కిఱిసె గుబ్బ

లేమో రొమ్మెల్ల నిండునే – వాని మాటంటే

నా మనసు పైపై నుండునే – వాని జూచితే

నవనిధుల బ్బినట్టుండునే – యెవరైనగాని   అక్క..

002. కల్యాణి – చాపు

(నాయిక: స్వీయ – స్వాధీనపతిక)

పల్లవి:

అమ్మా! యిటువంటివాని – కేమి సేయుదునే!

అను పల్లవి:

కొమ్మ! మువ్వగోపాలుని – గుణము చెప్పెద వినవమ్మ!

చరణము(లు):

పయ్యద–చేబట్టుకొని పాయజాలనని వాడు

సయ్యాట లాడుచు నన్ను చాలా వలపించునమ్మ    అమ్మా..

దబ్బున పడకింటిలో – దాగియుండుకొని నాదు

గబ్బిగుబ్బలనుబట్టి – కన్నులవొత్తుకొనునమ్మ అమ్మా..

సమ్మతించక నే నుంటే – సారెకు నదలించి చూచి

కమ్మ విల్లుకేళిలోన – కౌగిలించి కూడునమ్మ అమ్మా..

003. మంగళకైశిక – చాపు (నాయిక: స్వీయ – స్వాధీనపతిక)
పల్లవి:
అలల్ల అలల్ల కృష్ణ పదర నాతో నీవగలెల్ల
చరణము(లు):
'చిలుకల కొలికిరో! – చెలగు నీపైటలో –
కురికేది యదియేమొ – తెలుపవే!' "అది
కలికి జక్కవలంట – తెలియవో" 'అయితే
సెలవియ్యవే పట్ట – జేరునో?' "అది పట్టరాదు
బలుకొండలు" 'అయితే – ఎలనాగా? –
పైనెక్కని – చ్చేన?' "ఓరి
చిలుకల తేజివాని – చికిలి దుర్గములవి –
తలపున నీవెక్క – దర మౌన? ఓరి!" అలల్ల ..
'చక్కని పగడంపు – చాయల అది యేమేమో
మ్రొక్కేను తెలుపవే ముదితరో!' "వన్నె
కెక్కియున్న దొండపండది" 'అయితే –
చొక్కచు మొనపంట – నొక్కనే' "అది
నొక్కరాదు కెంపు – నిక్కము"
'ఎక్కువ వెలయిచ్చిన నిచ్చేనా?' "ఓరి!
ఎక్కడ వెలలేని – చొక్కంపు మణి యిది
దక్కించు కొననంట – తసికేవ? ఓరి!" అలల్ల..
'వినవే! నీ మొగమింత తళుకుమీటి
తనరేని అది యేమె?' "అది
యనగ అద్దములంట తెలియవ?" 'అయితే –
వనిత నీడ వచ్చునా?' "నీడ
కానగరాదు కపురంపు తునకలు" 'అయితే
నెనరుగ కలియ వచ్చేద?' "ఓరి!
ఘనుడ! మువ్వగోపాల! నిను గూడి కలసేను –
మునుపటి నెనరున – తనదేవ? ఓరి" అలల్ల..

004. మోహన – ఆది

(నాయిక: స్వీయ – స్వాధీనపతిక)

పల్లవి:

ఇన్నాళ్ళు మల్లాడిన – దిందు కోసమా?

అను పల్లవి:

మన్నించి నాపై దయ – మరువ వద్దమ్మలార   ఇన్నా..

చరణము(లు):

మనసు గట్టి చేసుక – మగువలార! వాని మీరు

కనుగొన వద్దనగానే – కనగోరుట

తనువు కాసించిగాదు – తగిన చవిలేదాయె

నని మీరు వెతజెంది – యసు రుసురనేరని   ఇన్నా..

వానిమాయల బెల్లి – వగల మాటల మీరు

వీనుల వినవద్దనగానే – వినగోరుట

మానవతులార! నాదు – మనసు తెలిసిన సఖిని

గాన మైతిమని మిగుల – కన్నీరు నించేరని   ఇన్నా..

పలుమారు మా మువ్వ గో – పాలరాయని మీరు

కలయవద్దనగానే – కలయగోరుట

కలనైన నా మాట – గడువవద్దని మీరు

తలచి జాలిచే చాలా – తల్లడమందేరని  ఇన్నా..

005. కల్యాణి – రూపక

(నాయిక: స్వీయ – స్వాధీనపతిక)

పల్లవి:

ఎందుదాచుకొందు నిన్ను – నేమి సేతు నేను

అను పల్లవి:

అందమైన నీ మోము – అయ్యారే ముద్దుగుల్కుచున్నది ఎందు..

చరణము(లు):

అందిందు తిరుగకురా – అతివలు నీ తోడి

పొందుగోరియే వేళ – పొగరుచున్నారు

ఎందఱెందఱని కాతు – నెంతని నే విన్నవింతు

పందెమాడు కొన్నారట! – పట్టుక పోయెద మనుచు ఎందు..

పలుమాఱు నా సామి – బయటకు వెళ్ళకు మ్రొక్కెను

నిలుపరాని మోహమున – నిన్ను జూచి చెలులు

అలరు నీ మోవి తేనె – యూని చప్పరించవలసి

కులుకు గుబ్బల ఱొమ్ము – గ్రుమ్మి పొయ్యెద మనుచు ఎందు..

మదముతో నా ముద్దు – మువ్వగోపాల నా సామి

గుదిగొన్న తమకమున – గూడి యిద్దరము

నిదుర పరవశమున – వదలునో కౌగిళ్ళు

పదిలముగ నా జడను – బట్టి కట్టుకొందునా ఎందు..

006. బిలహరి – ఆది

(నాయిక: స్వీయ – స్వాధీన)

పల్లవి:

ఎటువంటి స్త్రీల పొందైన హితమై యుండునా?

అను పల్లవి:

కుటిలకుంత నా మదిలో – కూరిమితో నుండగ ఎటు..

చరణము(లు):

మనసు మర్మము దెలియ వలసి – మగువల గొందరదెచ్చి

కినిసి ప్రక్క బడద్రోసి – కేరి నవ్వేరు

కనకాంగి నను ఒంపునప్పుడు – కన్నుల నీరు నించుక

వినయోక్తులుగా విన్నవించిన – వితము మరువనీయదు ఎటు..

చెలి ముద్దు పాదములాదిగ – శిరము దనుక చక్కదనము

నలిన సంభవునకు వ – ర్ణన సేయ దరమా?

అలివేణి దూరమైన – ట్లైతే మనసు దూరమా?

వలపున నా తనువా రమణికి – వారకమై యుండగను ఎటు..

చెలువ! మువ్వగోపాలుడైన శ్రీవెంకటరమణా! యని

కిలకిల నగవుల నా యెద గు – బ్బల గుమ్ముచు

కళలంటి పరవశము చేసి – కంతుకేళిన నన్నేలిన

మెతలను దలప నిపుడు నా – మే నెల్ల పులకరించెగా ఎటు..

007. మధ్యమావతి – ఆది

(నాయిక: స్వీయ – స్వాధీనపతిక)

పల్లవి:

తెలిసి తెలియలేక – పలికేరు చెలులు

అను పల్లవి:

కలిసియున్న నా సామిపై – గాక సేయ వశమా? తెలిసి..

చరణము(లు):

చలయేటి తమ బు – ద్దులు వినలేదని

యలిగి రేమి సేతు – నతివలెల్ల?

చెలువుని ముద్దమా – టలు నా వీనుల నుండి

తొలుకుచున్నవి తమ మా – టలకు చోటున్నదా? తెలిసి..

కొనగంట దముగను – గొన దింతైనాగాని

నెనరులేని దాయెనంచు – నిందించేరు

ఘనమైన సామిరూపు – కనులు నిండియుండగ

కనకాంగి! యితరులు – కానవత్తురటవే? తెలిసి..

నా పాల గల మువ్వ – గోపాలసామితో

కోపించుకొమ్మని – కొమ్మలనేరు

ఏ ప్రొద్దు నా సామి – యెద నిండి యుండగ

పాప మింతేగాని – కోపమున కిమ్మున్నదో? తెలిసి..

008. ఆహిరి – చాపు

(నాయిక: స్వీయ – స్వాధీనపతిక)

పల్లవి:

పచ్చియొడలి దానర! పచ్చియొడలి దాన – పాపడు నిలువడు

అను పల్లవి:

వచ్చికూడుటకు – వేళకాదు

వచ్చె తాళవోయి – వదలను నీపొందు –

మచ్చిక నొయ్యారి – మా మువ్వగోపాల! పచ్చి..

చరణము(లు):

మిసమిసలాడేటి – నొసటి సొంపుచూచి

కొసరి పైకొనేవు – కొల్లలుగా

కసరితే నొక వింత – గారాబు జేసేవు

రసికుడ! యీ వేళ – రారాదు పోపోరా పచ్చి..

పట్టకురా ఔమ్ము – పాలంటు జేతుల

ఎటు లోర్తును పరు – లేమందురు

వట్టిపోతే మొఱ – పెట్టును పసిబిడ్డ

అట్టె మనసు బిగ – బట్టుకో రెణ్ణెల్లు పచ్చి..

కారము తిన్నాను – కరకరలాడీని

ఈ రేయి శ్రీరం – గేశుడ!

మరుకేళిగూడ – మా మువ్వగోపాల!

ఆరడిపెట్టకు – మోరి! నా సామి! పచ్చి..

009. వరాళి – చాపు

(నాయిక: పరకీయ – స్వాధీనపతిక)

పల్లవి:

ప్రొద్దు పోదు నిదుర రాదు – పొలతి నెడబాసినది మొదలు

అను పల్లవి:

తద్దయు వీ పాపజాతి – దైవము పగ సాధించెనమ్మ! ప్రొద్దు..

చరణము(లు):

అనలు కొనలు వాటినట్లు – మనసు మనసు నెనసి చాల

పెనలు గొన్న చెలి మన్ననలు – వినము నుతిసేయక ప్రొద్దు..

అరువు ముడుపు గలిగిన చి – త్తరవు నెరవు ప్రతిమ వలెను

ఉర విరవై యున్న చెలిని – మరువ నెరవు గొననకట ప్రొద్దు..

మువ్వగోపాల! రమ్మని – ముద్దుపెట్టి కూడగాను – మూడవ వెరవు గాన నకట!

పువ్వు బోణి మోవి తేనె – భుజియించిన చవిదలచి ప్రొద్దు..

010. భైరవి – త్రిపుట

(నాయిక: పరకీయ – స్వాధీనపతిక)

పల్లవి:

మంచి వెన్నెల యిపుడు – మగువ మనకు

అను పల్లవి:

పంచ బాణుని కేళి – బాగుగా కూడుండ మంచి..

చరణము(లు):

బిగువు కౌగిటిలోన – పికిలి పిట్టల రీతి

బిగిమీర పెనగుచును – చిగురు మోవిని

సొగసుగా నీ మేను – ఝుమ్మనగ జేసెదను

అగడు సేయక నన్ను – ఆ పనికి లెమ్మనుమీ మంచి..

సన్నజాజులు నీదు – జడ నిండ జుట్టెదను

పన్నీరు గంధంబు – బాగుగా నలది

చెన్ను మీరగ గూడి – చికిలిగా తమిరేచి

నిన్ను మది కరగింతు – నిండు పున్నమి నేడు మంచి..

పలుమారు మువ్వగో – పాల రమ్మని పిలిచి

మొలక నవ్వుల తోను – ముద్దు బెట్టు నిను

నెలకొని సమరతుల – నేర్పుతో నేలెదను

ఎలనాగ! మోహతమ – మెల్ల దీరను నేడు మంచి..

011. కాంభోజి – త్రిపుట

(నాయిక: సామాన్య – స్వాధీనపతిక)

పల్లవి:

వేడుకతో నడుచుకొన్న – విటరాయడే!

అను పల్లవి:

ఏడుమూడు తరములనుండి – ఇందున్న కాణాచట

కూడుకొని మా మువ్వ గోపాలుడౌ విభుడు వేడు..

చరణము(లు):

మధుర తిరుమలేంద్రుడు – మంచి బహుమానమొసగి

ఎదుట గూర్చుండు మని – యెన్నిక యిమ్మనెనె!

ఇదిగో రెండువేల పదము – లిపుడెంచు కొమ్మనిన

చదురు మీద ఉన్న సామికి – సంతోష మింతింతగాదె! వేడు..

అళుకు దీఱి తంజాపురి – నెలకొన్న విజయరాఘవుని

వెలయ మనుజుల వెంబడి – వేగమె పొడగాంచి

చలువ చప్పరమున నుండగ – చక్కగ వేయి పదముల

పలుకరించుకోగానె – బహుమానమిచ్చె నా వేళ! వేడు..

బలవంతుడౌ గోలకొండ – పాదుషా బహుమాన మిచ్చి

తులసి మూర్తితో వాదు – దలచెనా వేళ!

వెలయ మువ్వగోపాలుడు – వెయ్యిన్నేనూఱు పదములు

నలువది దినములలోన – నన్ను గలసి వినుపించెనే! వేడు..

012. ముఖారి – ఆది
(నాయిక: సామాన్య – స్వాధీనపతిక)
పల్లవి:
సామికి సరియెవ్వరే? నాచక్కని
అను పల్లవి:
భామరో! తిరువళ్ళూరి వీర రాఘవ! సామి..
చరణము(లు):
నెలతరో! ఎప్పుడైన – నేనే చెక్కిలి జీరి
కలగి యెరుక లేకయే – చెలియ జీరెనంట!
తెలుసు కొమ్మనుగాని – యలగి మారు బలకక
చలియించని నిండు కుండ – వలె నుండునమ్మ! సామి..
కదసి నేనే వాని మోవి – గంటిచేసి మరపున
పదిరి యీలాగుననే – పడతి యుంచె నందున!
అదరిన? కోపగించిన? – అలసిన? సొలసిన?
మదిరాక్షి! నాచిత్తము స – మ్మతి బరచునమ్మ సామి..
భామరో మా మువ్వ గో – పాలుడౌ వీర రాఘవుడు
కామకేళి హొయలుగ – గలసి యుండగ
ఏమగువ వద్దనైన – ఈలాగుందువో యంటె
ఈ మాటెట్లంటివని – ఎంతో యుస్సురనెనమ్మ! సామి..
ఇంతిరో! వాడిందు వచ్చి – యెలమి కౌగిలించితే
యెంతో బడలిక దీరునే – వశముగాని
కంతు తాపము చల్లారునే – యింతకాదు నా
సంతస మెల్ల చేకూరునే – యెవరైనగాని అక్క..
పూని మువ్వగోపాలుడు – పైని చెయి వేసితే నా
మేన పులక లుప్పతిల్లునే – నా తమిరేచ
వానికే బిరుదుజెల్లునే – వాని గూడిన
మానసమెంతో రంజిల్లునే – యెవ్వరైనగాని అక్క..